Regd No. N. 45 / M. 3813

# గోలకొండపత్రిక

నిష్పక్ష, నిర్భయ స్వతంత్ర రచనలకు గోలకొండ

సాంఘిక, ఆర్థిక, కళా, విజ్ఞానాది వివిధ విషయములకు గోలకొండ

ప్రతి సోమ, గురువారములందు వెలువడు జాతీయపత్రిక

హైద్రాబాదు - దక్కన్ ౨౭ బహిమన్ ౧౩౪౭ ఫ.
శా.శ. ౧౮౫౯ ఈశ్వరనామ సంవత్సర మార్గశిర బ॥ ౧౩ గురువారము

సంపుటము ౧౨ | సంచిక ౬౬

## జిన్నాగారి ప్రబోధము

కలకత్తా డిసం: ౨౭

అఖిలభారత ముస్లింలీగు అధ్యక్షులగు జిన్నాగారు ఈరోజు ఉదయం మహమ్మదలీ పార్కులో పతాకోత్సవము సలుపుచు మహమ్మదీయులను అఖిలభారత ముస్లింలీగ్ కార్యక్రమమును విజయవంతముచేయు విషయమై వాగ్దానమొసగుమని ప్రబోధించిరి. ముస్లిం జాతి భావి పురోభివృద్ధికై ఈ వాగ్దానము అత్యవసరమనియు, మహమ్మదీయులు మనోవాక్కాయకర్మలతో ముస్లింలీగు కార్యక్రమాన్ని ఆచరణయందుంచుటకై ప్రయత్నింప వలెననియు నుడివిరి.

## జపాను ముట్టడి అసంభవము?

క్వాన్టన్ డిసం: ౨౭

క్వాన్టన్ రాష్ట్రమును జపానువారు ముట్టడించనున్నారను అనుమానము ౨౦ జపాను యోడలు మాకౌల్ సమీపమందు కనపడుట వలన మరింత ధృడమగుచున్నట్లు హాంకాంగ్ వార్తలవలన తెలియుచున్నది. ఆ కనపడినయోడలు యీవరకే ప్రదేశమును చేరవలసి యుండెనని యొకచీనా అధికారి చెలిపెను. ప్రభుత్వము వారివలన అట్టి అజ్ఞలేవియు బడలేదనియు, యీ యోడలు యుద్ధనావలుగాక జపానువారికి వస్తుసామగ్రి యందించు నావలై యుండవచ్చుననియు, అంతకు పూర్వమే యీ యోడలు దక్షిణ చీనాయందుండి యుండవచ్చుననియు, జపానువారు కెంటన్ లంక లేక పరిసర ప్రాంతములను ముట్టడింపలేదనియు, దక్షిణ చీనాను ముట్టడించుటకు కేలకొలది సైనికుల అవసరముండుననియు అచ్చటిప్రజ లనుకొనుచున్నారు.

## గ్రీసు యువరాజు వివాహము

లండన్ డిసం ౨౭

క్రిస్టమస్ పూర్తికాగానే డ్యూక్, డచెస్ ఆఫ్ కెంటుగారలు గ్రీసు యువరాజులగు పాల్, ప్రిన్సెస్ ఫ్రెడ్రికా వివాహమునందు పాల్గొనుటకు బయలుదేరెదరు. ఈ వివాహము ఏథెన్సునగరమున ౯ జనవరిరోజున జరుగగలదు. హిమంత ఋతుకేలవవుల వీక్షించుటకు కెంటుదంపతులు వివాహానంతర మాస్ట్రియాకు వెళ్లవచ్చును.

## బీహార్ అమాత్యులకు గాయములు

ఒక పత్రికావిలేఖరి గాయములవలన మృతినొందుట.

పట్నా: డిసం. ౨౭

బిహార్ ఆర్థికమంత్రులగు అనుగ్రహనారాయణ సింహగారి కారు పట్నానుండి, హాపూరునగరు వెళ్లుమార్గ మధ్యమున ఒక చెట్టుతో డీకొనెను. ఆర్థికమంత్రులకు గాయములు తగులుటయేగాక తిరుపతిగారను నొక పత్రికావిలేఖరులు ఈ అపూర్వ సంఘటనవలన మృతినొందిరని తెలియుచున్నది.

ఆర్థికమంత్రులు గాయములవలన అపాయస్థితిలో లేరనియు, వారినిమళ్లీ "స్టీములాంచి" ద్వారా పట్నాకు తీసుకవచ్చెదరనియు పట్నా వార్తలు తెలుపుచున్నవి.

## ౩౦ అరబ్బువిద్రోహులు చంపబడుట

హైఫా: డిసం ౨౭

హైఫాలో అరబ్బులు అల్లరులను శగ్గించుటకు ప్రయత్నము చేయుచున్న బార్డర్ రెజిమెంటు అధికారులు అల్లరులసంఘర్షణలో గాయపడిరని తెలియుచున్నది.

ఈఅల్లరులవలన ౩౦ మందిని అరబ్బువిద్రోహులు మృతులైరని హైఫావార్తలు తెలుపుచున్నవి.

## పౌరజ్ఞానబీజము జనసామాన్యములో నాటుటత్యవసరము

### మహిళాభ్యుదయము కలుగనంతవరకు దేశాభ్యుదయమగుననుట బూటకము

గా. శ్రీమతి విజయలక్ష్మీపండిత్ గారి హితవు.

ఢిల్లి డిస (టప్పా)

జాతీయమూలతత్వములు, పౌరసత్వములు, వ్యక్తులతో దీనికి నేరుగా సంబంధము గలదు. జాతీయాభ్యుదయమునకు యిరుగనోయగువారికి సత్వసంరక్షణలందు సాయమొనరించని వ్యక్తి దేశమునకు ప్రాణార్పణమొనరింపజాలడు. కావున మనపిల్లలను తగురీతిగా పౌరులగు విద్యనేర్పవలయును" ని గా. శ్రీమతి విజయలక్ష్మి పండితుగారు దర్యాగంజానందలి సరస్వతీభవనమునందు సమావేశమైన అఖిలభారత మహిళా మహాసభాధ్యక్షోపన్యాసమును ప్రారంభించిరి. సమావేశమునందు వివిధప్రాంతములనుండి ప్రతినిధిగాంగ్రేడేగాక శ్రీమతి జగదీశ ప్రసాదుగారి సతి, శ్రీమతి మిత్ర మొదలగువారలేకులు పాల్గొనిరి

దేశాభ్యుదయమునకు మహిళామణులు సలుపవలసియున్న సేవల విశదీకరించుచు "స్త్రీల అభ్యుదయము కలుగనంతవరకు దేశమభివృద్ధిగాంచజాలదు. అంతవరకు స్వాతంత్ర్యమునడపట్టి బూటకము నిరర్థకము. కొంతకాలము పూర్వము మనదేశమందు స్త్రీలు పరిపాలనా విషయములందు పాల్గొనుచుండిరనుటకుల చరిత్రలు ఘోషించుచున్నవ"ని యుదాహరణ పూర్వకముగా నుడివిరి.

"నేడు ప్రపంచమంతయు నట్టుడికినట్లుయుడుకుచున్నది. కొన్ని దేశములలో యుద్ధములు జరుగుచున్నవి. మరికొన్ని పరస్పరవైరములవలన ద్వేషభావముల వలన పెనుగులాడుకొనుచున్నాము: ఈపరిస్థితులలో యేది మనకు సిద్ధాంతమోగ్యమో, యేది హానికరమో విశదించుటకు వీలులేదు. కావున మీరు అభివృద్ధి గాంచవలయుననిన, మీయందు పరివర్తనము కలుగవలయునన్న వెంటనే మీరు ప్రాచీనాచారములను తొలగించి వేయవలయున"ని పలికిరి.

స్థానిక స్వపరిపాలనముల గురించి ముచ్చటించుచు "నేను ప్రస్తుతము సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమునందు అధికారరీత్యా స్థానిక స్వపరిపాలనా మంత్రిగాగలను. కాని, నాయీ స్వల్పకాలపు అనుభవమువలన స్థానిక స్వపరిపాలనా సంస్థలందు అవలంబించు మార్గములను మహాఘోరములుగా గలవు. ఒక కాలమునందు పంచాయితి రాజ్యమని ప్రసిద్ధిగాంచిన యీ దేశమునందిటుల జరుగుట విషాదకరము. ప్రజలయందు కణమాత్రమైన పౌరజ్ఞానము లేదు. ఎల్లకాలము వారిదృష్టి స్వక్తిగతి లాభముల నే తిలకించుచుండున"ని పలికిరి.

"దేశమునందు ప్రతివ్యక్తి ప్రజాసత్తపాలనము నభిలషించుచున్నాడు. కాని యీ ప్రజాసత్త పాలనమునకు స్థానిక స్వపరిపాలనము మూలాధారము కావున వెంటనే మనమందరము జన సామాన్యమునందు పౌరజ్ఞాన బాధ్యతా ప్రచార మొనర్పవలయును. ఈ తుప్పుపట్టియున్న స్థానిక స్వపరిపాలనా సంస్థలు సక్రమముగా తమ విధ్యుక్తధర్మములను నెరవేర్చునటుల పరివర్తింపజేయు టత్యవసరమ"ని హెచ్చరించిరి.

హాంకాంగ్ డిసం ౨౭

చీనా ప్రభుత్వమువారు మాస్కో నగర మందలి తమ ప్రతినిధులగు చాన్ చ్యాంగగారిని పిలుపించుకొనిరి. చీనాయందు జాతీయ ప్రభుత్వం స్థాపించిన సన్‌యట్సేన్ గారి కుమారుడగు సండూగారు ముఖ్యార్థిగా గలరు.

## జపాను ప్రభుత్వమువారి క్రొత్తయెత్తు

షాంఘాయి డిస ౨౭

ఇకముందు చీనాదేశములో జపాను ఆధీనమునందున ప్రజలు స్వీయాధికారసత్వములవలన లాభము పొందజాలరు. ఈప్రాంతములందంతట విప్లవప్రయత్నము గావించువారికి కఠినమగు శిక్ష లొసగబడుననియు, వీలునుబట్టి మరణ దండనములు, ఉరిశిక్షలు విరివిగా విధింపబడగలవని జపానుపత్రిక యొకటివ్రాయుచున్నది

## యూరపు విషలేఖిని

లండన్ డిస ౨౮

బ్రిటనుకు వ్యతిరేకముగా యిటలీ జరుపుచున్న ప్రచారమును విమర్శనపూర్వకముగా వివరించుచు లెఫ్టనెంటు కమాండర్ ఫ్లెచర్ పార్లమెంటునందు, క్రిస్టమస్ పండుగకు పార్లమెంటు సమావేశమాపుకొను చేయుటకు ప్రవేశపెట్టిన తీర్మాన సందర్భమున నుడివిరి.

"ముసోలిని యూరపుఖండపు విషలేఖిని ప్రపంచపు అంతర్జాతీయ సంబంధముల నన్నిటిని త్రెంచివేయుచున్నాడు. ఇటలీ ప్రపంచమున కల్పిత, కృత్రిమ పద్ధతులపై భయంకర రూపము దాల్చుచుండెను. పోర్చుగీసు, బ్రిటిషువారి సంబంధములు సిద్ధరూపముదాల్చు సమయమున అనవసర విషయముల ప్రకటించినది. జూలైమాసమునందు ముసోలిని చేంబర్లేన్ గారికి పేర లేఖబంపిరి. ఆతర్వాత తీవ్రముగా ప్రచారమునకు గడంగెను. ప్యాలస్టయినునందు స్వయముగా గృహకల్లోలము లారంభింపజేసెను. దేశమునందు అసంతృప్తి, అలజడి యేర్పడుటకు కృషి మొదలిడెను. ఇటలీ యేజంట్లు అరబుల హోటళ్ళలో రేడియోలపెట్టిరి, అరబి భాషయందిపుడు బాహాటముగా ప్రచారము సాగుచున్నది. బ్రిటిషుకు ప్రతికూలముగా ప్రచారము జరుపబడుచున్నది. కావున ప్రభుత్వము వారీవిషయమున శ్రద్ధవహించవలయును, ౧వ ఫిబ్రవరి వరకు సమావేశ మాపబడినది.

## "అపూర్వ విజయము"

## "రావు బహద్దురు" బిరుదము త్యజించుట

లింగాయతుల వర్గపు ప్రముఖనాయకులగు రావు బహద్దుర ముగ్గా, అన్నగడిగారు తమకు బ్రిటిషుప్రభుత్వమువారు ప్రసాదించిన "రావు బహద్దురు" బిరుదును త్యజించి కాంగ్రెసుసంఘమునందు సభ్యులుగా చేరిరి.

"ఇది నిజముగా యొక అపూర్వవిజయము కర్ణాటకమునందంతట యీవిషయము మహిమంతింపబడునని పత్రికా విలేఖరితో గంగాధరరావు దేశపాండ్యాగారు చెలిపిరి.

## భారతీయ గాయకులకు ముసోలినీ అఖండ స్వాగతము

ఇటలీ భారతదేశాలకు విజ్ఞానబాంధవ్యములు

కొందరు భారతీయగాయకులును, నటులును ఈమధ్య రోముకుపోయి ముసోలినిని దర్శించిరి ముసోలని వారిని సంపూర్ణగౌరవముతో నాదరించి వారలగానమును చాలసేపు వినెను, ప్రతిపాటయొక్కయు ఆటయొక్కయు భావము అడిగి తెలిసికొని, తనకు తెలియనివాద్యములను కొన్నింటిని వాయించుటకై వారలను కోరెను. పిమ్మట ముసోలిని తన సితారు తెమ్మని, ఆగాయకులు పాటపాడుచుండ, తాను ఆపాటల కనుగుణముగ వాయించెను. తుదకు ముసోలిని కొన్ని ఇటాలీయ జనసామాన్య ప్రచారమందుండు పాటలను సితారుపై వాయించెను.

ముసోలినీ భారతదేశమునకును ఇటలీకిని విజ్ఞానబాంధవ్యమును వృద్ధిచేయవలెనని తనకు కోరికగలదని చెప్పెను. ఈ బాంధవ్యమును పెంపొందించుటకై రోమునగరమందు ఒక సంఘముకూడ ఏర్పడెను. ఇంకను ఎక్కువమంది కళోపాసకులు ఇటలీకి వచ్చుటకు ఏర్పాట్లుచేయబడుచున్నవి.

## "దీనసేవయే కాంగ్రెసు ఆదర్శము"

కరాచీ డిస ౨౭

బల్లాభాయి దేశాయిగారీ వారాంతమున తమకూతురు, కుమారునితో సింధుకు దయచేసిరి. దోవయందనేక స్టేషనులలో ప్రజలు వీరికి స్వాగత మొనరించిరి. బాకెనందు వీరిని ప్రజలూరేగింపుతో తీసుకవెళ్లిరి. దేశాయిగారొక మహాసభకిచట ప్రారంభోత్సవము సలుపుచు "కాంగ్రెసు యొక ప్రత్యేకవర్గమునకు, మతమునకుచెందిన సంస్థ గాదు. అట్టిసంకుచితభావములపై యీసంస్థ ఆధారపడిలేదు. దీనుల, అసహాయుల, దరిద్రుల సేవసలుపుటయే దీని ముఖ్యోద్దేశము. కావున దేశీయులందరు ప్రజలలో సఖీభావములు పెంపొందించుటకు కాంగ్రెసు సంస్థను చేదోడుగా నుండవలయును. దేశమందలి వివిధవర్గములవారు పరస్పర యైకమత్యమునకు దీక్ష వహించవలయున"ని ప్రబోధించిరి.

మహాసభయందత్యవసర విషయములను గురించి జరిగిన తీర్మానములలో కలకత్తాయందు అఖిలభారత కాంగ్రెసు కార్యకారిణీ సంఘమువారు తీర్మానించిన ఫెడరేషన్ ప్రతికూలన తీర్మాన మేకగ్రీవముగా యంగీకరింప బడినది.

## అఖిలభారతగ్రంధాలయ మహాసభ

బాజ్పాయిగారి ఉపన్యాసము

ఢిల్లీ: డిసెం ౨౭

"గ్రంథస్థమైనది శాశ్వతముగా నుండును. నోటిమాట గాలికిపోవును, అందుచేతనే రేడియోయంత్రములు వచ్చినను, వార్తాపత్రికలు వచ్చినను, గ్రంథాలయముల యావశ్యకతకుగాని, సుస్థిరత్వమునకు గాని భంగముకలుగుటలేదు. గ్రంథాలయములు విద్వాంసులకు మాత్రము పనికివచ్చెడి యంత్రాగారములుగావు. జనసామాన్య విజ్ఞాన వికాసములకై గ్రంథాలయములు వినియోగింపబడును. జనసామాన్య విద్యాభివృద్ధికిని, గ్రంథాగారములకును, పరస్పర సంబంధ మేర్పడవలయును. అప్పుడుగ్రంథాలయములు శాశ్వతముగా సుస్థిరములై యుండగలవు. "అనిభారతప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి ర్ జి. ఎస్. బాజపాయిగారు అఖిలభారత గ్రంథాలయ మహాసభను ప్రారంభించుచు, నుడివిరి.

మహాసభాధ్యక్షతను వహించిన డాక్టరువలీ మహమ్మదుగారు, ప్రాథమిక విద్యాభివృద్ధికై కోట్లకొలది ద్రవ్యము వ్యయపరుపబడుచుండగా గ్ర[illegible]యప

రచుట ఉత్కృష్టపద్ధతిగాదని నుడివిరి. గ్రంథప్రకాశకులు గ్రంథ స్వామ్యరక్షణకై పంపెడి గ్రంథములు రాష్ట్రీయ ప్రభుత్వ గ్రంథాగారము అందే యుండుటచే భారతగ్రంథాగార మేర్పడు అవకాశము కలుగుటలేదనియు, ప్రభుత్వమువారు భారతదేశమందు ప్రకటింపబడెడి ప్రతిగ్రంథమును భారత గ్రంథాగారమునకు పంపవలయునకాడిన్నిర్బంధ మేర్పరచవలయుననియు, రష్యాయందిట్టి గ్రంథాగారములు ౩౭ గలవని నుడివిరి.

## పట్టాభిగారిని ఆంధ్ర మహాసభ ఆహ్వానించలేదు

### పత్రికలలో ప్రకటింపబడిన వార్త సత్యదూరము

సాయిసంఘ కార్యదర్శుల అధికార ప్రకటన

అఖిలభారత సంస్థానప్రజా మహాసభాధ్యక్షులును; ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులునగు శ్రీ డాక్టరుపట్టాభిగారు నిజాం రాష్ట్రమునందు ముఖ్యముగా తెలంగాణామందు పర్యటనగావించి పరిస్థితులను తెలిసికొననుద్దేశించి ఆంధ్రమహాసభ స్థాయి సంఘ కార్యదర్శిగారికొకలేఖ వ్రాసిరట్లు, దానిపై స్థాయి సంఘ కార్యదర్శిగారు కొన్ని షరతులను సూచించుచు వాని ననుసరించి శ్రీపట్టాభిగారు విచ్చేయదలచుచో తాము పర్యటనయందు సాయము గావించజాలెదమని తెలిపిరనియు ఈనెల ౨౦వ తేదినాటి ఆంధ్రపత్రికలో ఒక వార్త ప్రకటింపబడినది. ఇంతేకాక ఆ వార్తయందు నిజామాబాదు ఆంధ్రమహాసభయందు అధ్యక్షులవారిచే భాషా సంబంధమున చేయబడిన ప్రసంగము క్రమమైనదా? కాదాయను విషయమున శ్రీ పట్టాభిగారి అభిప్రాయమును స్థాయిసంఘ కార్యదర్శిగారు వాంఛించిరనియు కలదు; ఈవార్తనుగూర్చి స్థాయిసంఘ కార్యదర్శిగారు దిగువ అధికారప్రకటన గావించుచున్నారు:—

"శ్రీయుత డాక్టరు పట్టాభి సీతారామయ్యగారిని స్థాయిసంఘ కార్యదర్శి ఆహ్వానించినారనియు, డాక్టరుగారు మైసూరు సంచారము పిదప ఇక్కడికి నైయాహ్వానము నంగీకరించి రాదలచినారనియు ఆంధ్రపత్రికయందు ప్రకటింపబడినవార్త సత్యదూరము!"

## నిరుద్యోగ నివారణకై సంయుక్తరాష్ట్ర ప్రణాళిక

గృహపరిశ్రమల వ్యాప్తికై లక్ష రూపాయీలొసగబడును

లక్నో డిసెం. ౨౬

సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమువారు యేదేని ప్రత్యేకపరిశ్రమయందు నిపుణతనుబడసి, దాని వ్యాప్తికై సలుపునట్టి యువకులకు సహాయమొసగుటకై ఒక లక్ష రూపాయీల నొసగుటకు నిశ్చయించుకొనినట్లు ప్రకటనవలన విదితమగుచున్నది.

ఈ గొప్పమొత్తము గృహపరిశ్రమలు, చేతిపనుల అభివృద్ధికై యొసగబడును. ఇంతేకాక పారిశ్రామికాభివృద్ధికి మూలములగు యంత్రములను, యంత్రసామాగ్రులను కొనుటకును, సంయుక్తముగా నెలకొల్పబడు వ్యాపార సంస్థలకును సహాయము గావించబడును.

## తూర్పుగోదావరి మోటారు ప్రమాదము

ముగ్గురు మరణించిరి
అయిదుగురు ప్రమాదావస్థలోనున్నారు

రాజమండ్రి డిస ౨౬

ఈనెల ౨౨వ తేదీనాడు మండపేట సమీపమునందు జరిగిన మోటారు ప్రమాదవివరములు తెలియవచ్చినవి. శ్రీ మూర్తికృష్ణ మోటారు సర్వీసువారి బస్సు ౨౨వ తేది నాడు మండపేటనుండి బయలుదేరి మండపేట కంతెనపై ఎదురుగావచ్చుచున్న జట్కాను తప్పించుకొను ప్రయత్నములో బస్సు కాలువలో దొరలెను.

బస్సునందున్న ఆలమూరు మెజిస్ట్రేటు న్యాయస్థానమునందు విచారింపబడి శిక్షనుపొందిన నలుగురు నేరస్థులలో ఇద్దరును ఒక విశ్వబ్రాహ్మణ యువకుడును వెంటనే మరణించిరి. వీరిశవములు పసలపూడిలాకు సమీపమున దొరికినవి. ఆలమూరు పోలీసువొకడిద్దరును, మిగతయిద్దరును ఖైదీలును, మరియొక ప్రయాణీకుడును వైద్యశాలయందు చేర్చబడి ప్రమాదావస్థయందున్నారు.

## కోటాలక్ష్మయ్యగారి భూరి విరాళము

౨ లక్షలు ప్రజాహితసంస్థల కొసగుట

గుంటూరు డిస ౨౬

ఇటీవలనే కీర్తిశేషులైన ఆంధ్రప్రముఖులగు శ్రీ కోటా లక్ష్మయ్య నాయుడుగారు మరణసమయమున ప్రజాహితమునకై కృషిసలుపుచున్న సంస్థల సహాయమునకై రెండులక్షల రూపాయీల భూరివిరాళముల నొసగిరి. వీరు తమ మరణశాసనమునందు విద్యాభివృద్ధికి ౨౫ వేలు మతవిద్యకు ౨౫ వేలు, వైద్యసహాయమునకై ౨౫ వేలు, శక్తిహీనులకు ౨౫ వేలు ప్రత్యేకించిరి. ఇంతేకాక వీరలగు తమబంధువులకు నాయుడుగారు ఒకలక్షరూపాయలను దానమొసగిరి.

## నాజీ, కమ్యూనిస్టు నిర్బంధితుల విడుదల

లండన్ డిస ౨౮

విచారణయందున్న నాజీ, కమ్యూనిస్టు నిర్బంధితులందరు పెద్దపండుగ సందర్భమున నాజీఅధికారులు విడుదలచేయ నిశ్చయించినటుల తెలియుచున్నది.

## స్వీకారము

రాజు అండు కంపెనీ క్యాలెండరు

రాజు అండు కంపెనీ యజమానులగు శ్రీ కల్లూరి జనార్దనరావుగారు మూడు క్యాలెండరులు మా కార్యాలయమునకు పంపినారు. ఈనూతన క్యాలెండరులును సుందరముగాను, ఆకర్షణీయముగాను గలవు.

# మిడ్నపూరు అడవిలో దొరికిన "మానుష వ్యాఘ్రాలు"

## తోడేలు సాకిన పిల్లలు మానవులుగ మారిన అద్భుత చరిత్ర

వారిఉనికి, అలవాట్ల ఆహార, విహారాలు

## కథగాదు, కనికట్టుగాదు, యథార్థంగా జరిగిన విషయం!

(రివరెండ్. జెచ్. సింగ్ గారివ్రాలు)

౨.

ఆపిల్లయొక్క దేహాలు, వారిచర్మం అతిసున్నితంగా వుండేవి. ఎంత సూక్ష్మంగా ముట్టుకున్నా వెంటనే వారికి తెలిసిపొయ్యేది; సాధారణంగా పిల్లలను ముట్టుకుంటే అలా తెలియదు. వారికాలివేళ్లు విశేషంపొడుగ్గావుండేవి. అందులో ముఖ్యంగా మొదటి రెండువేళ్ళు అసాధారణంగా పొడుగ్గా వుండి, వాటి మొదళ్లవద్దఎత్తై, క్రమంగా చాలా ఏటవాలుగాపోయి వుండేవి. మడమకు వ్రేళ్లకు మధ్యభాగం సన్నమైవుండేది. మడమలు వెడల్పుగాను, చదరంగాను వుండేవి. మోకాలికీళ్లు పెద్దవిగాను, బరువుగాను, బలంగాను వుండేవి.

ఈపిల్లలిద్దరు ఎన్నడుగాని నిటారుగ లేచి నిలవబడినవారు కాదన్నవిషయం మనం మరవరాదు. ఎప్పుడూ నాలుగుకాళ్లతో— కాళ్లు చేతులతో— పరువెత్తేవారు; లేదా మోకాళ్లమీద దోగాడేవారు. వారి కాలివేళ్లు చేతివ్రేళ్లగోళ్లు, అతికి మెలితిరిగి వుండేవి. నడిచేటప్పుడు అగోళ్లతో భూమిని బరుకుతూ వెళ్ళేవారు. చేతులు, మోకాళ్లమీద నడిచేటప్పుడు పాదాలను వెంటయీడ్చుకుంటూ నడిచేవాళ్లు మణికట్టులోభాగంలోను, మోకాటిచిప్పలమీదను, మోచేతులలోను మొద్దుబారి కాయలుగా చిక్కుబడి వుండేవి. తమకాళ్లను చాలా తక్కువగ ఉపయోగించినందుచేత, కాలికండరాలు, నరాలుగట్టిబారి, లేచి నిలబడటానికి తగిన జవసత్వాలు కలిగి వుండేవికావు. పిరుదులుచాలా సన్నగావుండేవి. పిక్కలు రక్తమాంసాదులు లేకుండా వున్నప్పటికీ, గట్టిపడి వెన్నెముకతో పరిమితంగా వుండేవి, చేతులు మామూలుకంటె విశేషమైన పొడుగుండేవి. సరిగ్గా లేచి నిలిచినట్లైతే చేతులు మోకాళ్లంటేవి— చాలా పుష్టిగాకూడా కన్పించేవి. కంఠం పొట్టిగాను, కండపుష్టితోను వుండి విశాలమైన బుజాలపైన దివ్యపుష్పాలంలో క్కుళంగి బిగించినట్లుగ వుండేవి. మొత్తంమీద శరీరనిర్మాణం యావత్తూ శక్తినీ, పటుత్వాన్నీ సూచిస్తుండేది. తలమాత్రం బలహీనఎముకలువున్నా, కొంచెం పొడుగ్గాను, సన్నగాను కన్పించేది, కండ్లు గుంటల్లోకి పోయినట్లుండేవి. ముక్కు చదునుగావుండి పొడుగ్గావుండేది. ముక్కు రంధ్రాలు చాలా పెద్దవిగా వుండేవి. పెదవులు పొడుగ్గాను, లావుగాను వుండేవి. గడ్డం మొనతేలి వుండేది. చిన్నపిల్లకు మరీ సూదిమొన తేలినట్లుండేది. బుగ్గలుబాగాబలిసి, బుర బురలాడుతుండేవి. దవడ యెముకలు చాలా ఎత్తుగావుండి,ముందుకువచ్చినట్లుండేవి. ఎముకలనుంచి మాంసాన్ని చీల్చుకొని తింటూవుండే అభ్యాసంచేత అలా ఏర్పడ్డవని సింగుగారి అభిప్రాయం. ప్రక్కకు తిరిగినప్పుడు ముఖం కోణాలుతేలి వుండేవి. కనురెప్పలు దట్టంగాను, పొడుగ్గాను వుండేవి. నుదురు సన్నమై, ముడుతలుపడి వుండేవి. కండ్లు కొంచెంగుండ్రంగా వుండేవి. పగటిపూటంతా నిద్రపోతున్నట్టు బరువుగా కన్పించేవి. రాత్రుళ్ళు మాత్రం—మరీ అర్ధరాత్రి దాటింతరువాత— పూర్తిగా తెరచుకొనివుండేవి. దంతాలు దగ్గరగా కొంచెం హెచ్చుతగ్గులుగ వుండేవి. పండ్ల చివరలుమాత్రం పల్చగాను చాలా వాడిగానువుండేవి. నోటికి లోభాగం అంతా రక్తంలాగా ఎర్రగావుండేది. చెవులు చాటల్లాగా పెద్దవైవుండేవి.

*  *  *

కాళ్లుచేతులు నాలుగింటితో—ఈమృగాల్లాగా వేగంగా పరుగెత్తేవాండ్లు. పరుగిడితే వాండ్లను చిక్కించుకోవటమే కష్టంగా చాలా నిలవేటానికిగాని, నడవటానికిగాని వాండ్లను చేతనయ్యేదికాదు.వాండ్లు యిలాగా పరుగులెత్తేటప్పుడు వారిశరీరాలు క్రమంగా పైకిలేవటము, క్రిందికి పడటము వుండేవి మొదటల, తరువాత దేహానికి ఎదికి పైకి ఎగురుతుండేది.

చీకట్లో ఆపిల్లలకండ్లు పిల్లికండ్లలాగా,నీలపురంగుతో తళతళా మెరిసేవి; గాఢాంధకారంలో అరెండుకన్నులూ రెండు నీలి దీపాలలాగా మెరుస్తుంటవి. వాటిలోంచి కిరణాలు ప్రసరిస్తూంటవి. అయినా, వాటి కిరణాలు తప్ప చిమ్మచీకట్లో మరొకటి కన్పించదు. ఏదైన దీపం తెచ్చినట్లయితే అనీలపు కిరణాలు మాయమౌతవి.

వెలుతురులోకంటె చీకటిలోనే ఆపిల్లలు బాగా చూడగలిగేవారు మరీ కటికరాత్రులలో—మానవ నేత్రాలకు ప్రపంచమంతా శూన్యంగవుండేటప్పుడె—ఆపిల్లలిద్దరూ తమచుట్టుప్రక్కల ప్రతి చిన్నవస్తువును కనిపెట్టగలిగేవారు; అలాగే దట్టమైన అమావాస్య చీకటిలో ఎంత హెచ్చుతగ్గుల నేలమీదనైనాసరే కాళ్లుచేతులు నాల్గింటితో అరమరలేకుండా, తొట్రుపాటు లేకుండా పరుగెత్తుతారు.

వూపిరి పీల్చేటప్పుడు, వదిలేటప్పుడు వారి ముక్కురంధ్రాలు పైకి వుబుకుతూ ముడుచుకుంటూవుంటవి. వారి ఘ్రాణేంద్రియాలు చాలా చురుగ్గా పనిచేసేవి. ఎంతసూక్ష్మమైన వాసనైవాసన క్షణంలో పసిపట్టగలుగుతారు. మనుష్యులుగాని, జంతువులుగాని వారిని సమీపించినట్టయితే, ముక్కులు పైకెత్తి, విపరీతమైన అతిధ్వనిచేస్తూ, బలకంఠంగాగాలిపీల్చేవారు వారికన్నుల వర్ణం తరుచుమారుతుండేది,ఏదైన భయకారణం కలిగినప్పుడు కండ్లు వణికేవి. వారి దృష్టిగాని, వినికిడిగాని మానవులకంటె చాలా సూక్ష్మమైనదనే చెప్పాలి. పెదిమలుకూడా చాలా సున్నితమైనవి. వారికి కోపం వచ్చినా, భీతికలిగినా పెదిమలు అల్లల్లాడేవి.

వారుగుండ్రంగా చుట్టచుట్టుకొని నిద్రించేవారు. చేతులు, కాళ్లు వొళ్లకట్టాగా వ్రేల్చుకొని. కుక్కపిల్లలు, పందిపిల్లలలాగా ఒకరిమీద వొకరు పడుకొని నిద్రపోతారు. ఎంత నిద్రలోవున్నా వారికి అతి మెలకువ. ఏమాత్రం స్వల్ప ధ్వనిఅయినా వులికిపడిలేస్తారు. నిద్రలో వుండేటప్పుడు గురకపెడతారు. పండ్లు కొరుకుతారు. అప్పుడప్పుడు మొరిగేవారు. వాళ్లు నిద్రపొయ్యేది చాలాతక్కువ. ఒక్కొక్కప్పుడు మధ్యాహ్నం పూటే కొద్దిగాతలవాల్చేవాండ్లు పగటిపూటే ఒకమూలకూర్చుని తూగుతుండేవాళ్లు. రాత్రులు సామాన్యంగా పదిపన్నెండుగంటల మధ్య నిద్రించేవారు.

అర్ధరాత్రి దాటింతరువాత సాధారణంగా నిద్రించేదేలేదు; ఎందుచేతంటే సగం రాత్రి అయింతరువాతనే జాగ్రదవస్థలో వుండి ఆహారానికిగాని బయటసంచరించే అలవాటువారికి రాత్రులంటే భయ మేలాగావా వాడికి లేకగదిలోవేసి తలుపులు బిగిస్తుండబట్టిగాని, లేకపోతే ఆహారంకోసం అడవిలోకి పరుగెత్తిపొయ్యేవాండ్లే ఏవాడో. గదిలోవుంచితే గదిలోనో, లేక ఆశ్రమందొడ్డిలోనో ప్రతిరాత్రికూడా చుట్టిచుట్టి తిరుగుతుండేవారు.

ఎండవున్నా, వెలుతురున్నా వారికి ఎంతమాత్రం యిష్టంవుండేదికాదు. ఎండలోకి తీసుకవస్తే ఎగరోజుతూ, ఏదైనా నీడగావుండే మూలకు పరుగెత్తేవారు; అమూలకువెళ్లి బిత్తరపోయి కండ్లు మూసుకునేవారు. పగటిపూటగాని, వెలుతురులోగాని వస్తువులను స్పష్టంగా చూడలేరని అనేక పరీక్షలవల్ల సింగుగారు తెలుసుకున్నారు.

(౭వ పేజి చూడుడు

## తోడేలుసాకిన పిల్లలు

(అరకేళి రచయిత)

మొట్టమొదట మిషను ఆశ్రమానికి తేబడ్డప్పుడు (౧౯౨౦ నవంబరు ౪ తేది) ఆపిల్లలిద్దరు చిక్కి, శల్యంగా వుండేవారు. నేలమీద దోగాడేదానికికూడ వారివంట్లో బలంలేకుండా వుండేది. ఆపిల్లల పూర్వాశ్రమ సమాచారం తెలియనే తెలియదు. తల్లిదండ్రులు లేక, పోషణలేక అవిధంగా వుండిపోయినారనే తక్కినవాళ్ళంతా అనుకునేవారు. సింగుగారి సతిమాత్రం ఆపిల్లలకు తల్లికంటె ఎక్కువగావుండేది. వారికి సమస్తోపచారాలు చేసేది. ఆపిల్లలకు నీళ్లుపోసి, జడలుగట్టినవారి జుట్టు కత్తిరించటానికి వారితో ౨౦ రోజులు సతమతం కావలసివచ్చింది. ఆరెండుసంవత్సరాలు చేసింతరువాత వారికి కొంత మానవరూపంవచ్చింది. వారి దేహాలపైన గంట్లు, గాయాలు మారేటప్పటికి కొన్ని నెలలు పట్టింది.

* * *

మాంసం తినటం తప్పితే ఆపిల్లలకు మరో హవిషయం మీదాగాని శ్రద్ధ లేనేలేదు. మాంసం పెట్టటయితే క్రూరస్వభావం ఏర్పడి తరువాత అలవికాకుండా పోతారేమోనని అనుమానించి సింగుభార్యగారు వారికి మాంసాహారం పెట్టేది కాదు. అందుచేత మిషన్ ఆశ్రమంలోవుండే తక్కిన పిల్లలందరితో బాటే వరి అన్నం, పాలు, కూరగాయలే యిస్తూ వచ్చారు. ఈ ఆహారంవల్లనే వారికి పుష్టి కలగడం ప్రారంభించింది.

ఒకసారి అడవిలో ఐదునెలల పసికందొకడు నిరాధారంగా పడివుంటే మిషన అధికారులు ఆబిడ్డను తీసుకొచ్చి, పెంచుతూ వచ్చారు. ఈ (తోడేలుపిల్లలు) ఆశ్రమానికి వచ్చేటప్పటికి ఆబిడ్డకు సంవత్సరం యీడు. అప్పుడప్పుడే నెమ్మదిగా అంబాడుతూ వుండేవాడు. ఆ వొక్కపిల్లవాడితోమాత్రం మొదట్లో ఈపిల్లలిద్దరూ చెలిమిచేసుకున్నారు. కాని, ఒకసారి తోడేలుపిల్లలు ఆపసికందుకు ఎందుకో కొరికి గోళ్లతో రక్కారు. అప్పటినుంచి ఆపిల్లకుంక వాండ్లదగ్గిరకు పొయ్యేవాడుకాదు. ఇది తప్ప ఆశ్రమంలోవుండే తక్కినపిల్ల లెవ్వరితోగాని మొదట్లో తోడేలుపిల్లలకు స్నేహం వుండేదికాదు. పగలంతా ఏదో చీకటిమూలకుపోయి అక్కడ నక్కి గోడవేపు శూన్యంగా చూస్తుండటంతప్పితే, ఇంకోప్రసక్తే ఆపిల్లలకు అక్కరలేదు. వారిని ముట్టుకున్నా, ఏదైన చూపించినా అయిష్టంగాచూచి మళ్లీ మొహం తిప్పుకుండేవాళ్లు.

ఆడేగదిలో తక్కినపిల్లలంతా ఆడుతుండేవాళ్లు. నవ్వుతూండేవాండ్లు. కాని ఆడవిపిల్లలిద్దరుమాత్రం ఇతరులేం చేస్తున్నా లెక్కచేయకుండా తమవరకు తాము అమూలనేనక్కి తపస్సుచేస్తుండేవాళ్లు.నవ్వటంఅంటే ఏలాగో వాండ్లకు తెలియదు. హాస్యరసమే వారిలో వున్నట్టు లేదు; అంతేకాదు విచారంకూడా వారికున్నట్టులేదు. అమలా చచ్చిపోయినప్పుడు తప్పితే మరెన్నడుగాని కమలా దుఃఖమనేది కన్పరచలేదు. తన స్నేహితురాలు చచ్చినప్పుడు మాత్రం కమల కండ్లవెంట కొద్దిగా నీళ్లు కార్చింది.

ఆశ్రమానికి వచ్చిన చాలారోజులవరకు తమ పూర్వస్నేహితులు తోడేలుపిల్లలకోసం పరితపించినట్టు విశదమయ్యేది. మానవ సాహచర్యం వారికి గిట్టలేదు. మనిషిజాడ కన్పిస్తే తల ఆటు యిటు కదల్చనైనా కదల్చకుండా ఒక పక్కకుపోయి నక్కేవారు. వొంటరిగావుంటే చాలు వారికి.

* * *

ఐదారు నెలాఖరున ఒకసారి ఆశ్రమంనించి తప్పించుకుపోవటానికి ప్రయత్నం చేశారు. గదిలో వాండ్లిద్దరుకాక ఇంకొక్క పిల్లమాత్రమే ఉండేవాడు. ఈ పిల్లలిద్దరూ తప్పించుకపోవటానికి ప్రయత్నిస్తే ఆపిల్ల అడ్డుపెట్టింది. కాని ఆపిల్లను కరచి రక్కి భయపెట్టి గబగబా పరుగెత్తి ఆదాపున్నే ఉన్నపొదల్లో దాక్కున్నారు. తిరిగి వాండ్లను మళ్లీ పట్టుకొచ్చేటప్పటికి మిషను అధికారులకు తల ప్రాణం తోకకు వచ్చింది

మూడునెలలవరకూ ఆశ్రమంలోని తక్కిన పిల్లలెవ్వరుగాని దగ్గరకువస్తే చీకరించుకోటం, పండ్లు బయటకిచూపించటం, మొరగటం, ఈ విధంగా అయిష్టంచూపించేవాళ్లు, తోడేళ్లసహవాసం లేకపోవటం, రాత్రులు ఆహారంకోసం బయట సంచారం నిలచిపోవటం, పచ్చిమాంసం ఆహారంగా లభించకపోవటం ఇవన్ని వాండ్లను చాలాకష్టంగా కన్పించినవి. వాటికి ప్రత్యామ్నాయంగా ఎన్ని ఆకర్షణలు చూపినా అవి వాండ్లమనస్సు కెక్కలేదు.

* * *

తక్కల్లాగా పళ్ళెంలో మూతులుపెట్టి తిండి తినేవారు. నీళ్లుగాని, పాలుగాని అలాగే గతికేవాళ్లు. ఆకలివేసినప్పుడు ముక్కులతో వాసనగాలిపీలుస్తూ ఆహారంపెట్టేత వ్రుస పదేపదేవచ్చి వెళ్లుతుంటారు; చివరకు,సింగుగారి భార్య దగ్గరకు వచ్చి కొంచెంసమీపంలో ఆహారంయిచ్చేదాకా అలాగే కూర్చునేవాండ్లు.

కొంతకాలం జరిగింతర్వాత మోకాళ్లమీద కూర్చుని అన్నంపెట్టివుండే గిన్నెనుఅందుకోటానికి ప్రయత్నించారు. ఇద్దరిలో చిన్నదైన (అమలా)తనకుదాహంవేసినప్పుడు "భూ,భూ" అని వింతగా అరచేది. కమలామాత్రం అలా అరిచేదికాదు; నాలుకతో తనపెదిమలు నాకేది; అది దాహమైందనిగుర్తు. పాలంటే వారికి చాలాయిష్టం. నీళ్ళుకావాలనని వుండేదికాదు. కొన్నిరోజులకు కమలాకూడా తన "చెల్లెలి" లాగా "భూ,భూ" అనటం మొదలుపెట్టింది. ఆకలివేసినప్పుడు ఆదేవింతగా అరిచేవాళ్లు. ఆ అరుపులు మనుషుల అరుపులుకావు; జంతువుల ధ్వనలూ కాకుండా వుండేవి.

* * *

శీతోష్ణాలభేదం ఆపిల్లలకు అట్టే తెలిసినట్టు వుండేదికాదు: వర్షాకాలంలో,చలివేసేటప్పుడు వెచ్చనిగుడ్డలు వాండ్లపైనకప్పితే వాటిని చింపి పారవేసేవాళ్లు. రాత్రులు కప్పుకోటానికి కంబళ్లుయిస్తే వాటిని దూరంగా విసరివేసేవాళ్లు. ఎంత చలివేసినా వణికేదిలేదు. ఎంత ఎండకాచినా చెమటపట్టేదికాదు. ఒంటిమీద గుడ్డవుండటం వాళ్లకు ఎంతమాత్రంగిట్టదు. ఏగుడ్డయిచ్చినా దాన్నిచింపి ముక్కలు ముక్కలు చేసేవాళ్లు ఒక చిన్న అంగవస్త్రంలాంటిదిమాత్రం వూడిపోకుండా నెవకపైపు కట్టివేశారు. అది వూడకుండా మనహా వేరే గుడ్డ ఏమీ వుండేదికాదు.

అచిన్న అంగోస్త్రానికే "కమల" చీదరించుకుండేది. 1924 డిసెంబరులో "కమల"కు ఆ అంగోస్త్రం తీసివేసి వదులాటి లాగొకటి యిచ్చారు. అమార్పుకు కమల చాలా సంతోషించింది. ఆ అంగోస్త్రం కట్టువిప్పినేలమీద పెట్టివుంచారు. పక్కనేవున్న ఒకతుంటరిపిల్ల "కమల ఆ అంగోస్త్రాన్నే కట్టుకోవాలి" అని వేళాకోళంగా అన్నది. "కమలకు" అమాట అర్థమైంది. ఆ గుడ్డపేలికను గబుక్కున లాక్కొని బయటికి పరుగెత్తి, దూరంగా పారేసివచ్చింది. ఎంత శీతగాలి కొట్టుతున్నా వారిదేహాలు తాకేచల్లగావుండేవి. వారిఒళ్లు సున్నగా మెత్తగా వుండేది. గరుకుదనం, మట్టి, మురికి వుండేదికాదు.

* * *

నిప్పంటే వాండ్లకు తగనిభయం. కొరివిచూపిస్తే భయపడి పరిగెత్తేవాళ్లు. లాందరుగాని, ఆఖరుకు విప్పుపుల్ల వెలిగించినా చూచి సహించలేరు. అయితే సాయంకాలం సూర్యాస్తమయం అయ్యేటప్పుడు ఆకాశం ఎర్రబారినప్పుడు అదర్శంచూచి, ఆనందించేవాళ్లు: రోజూ ౬-30 గంటలకు ఇంట్లోనించి బయటికి వచ్చి సూర్యాస్తమయం చూచేవారు.

ఆపిల్లలకు స్నానాలు చేయించటం వొక బ్రహ్మప్రళయం, స్నానానికిరమ్మంటే గిజగిజతన్నుకునేవాండ్లు. చివరకు తప్పనిసరిఅని తెలిస్తే అయిష్టంగానే సమ్మతించేవాళ్లు. ఎంత ఎండగాచినా చన్నీళ్లస్నానం వాళ్లకుయిష్టమేలేదు.

చీకటిఅంటే వాళ్లకు భయంలేకపోయినా, రాత్రుల్లో ఆపిల్లలిద్దరూ ఒకర్నివిడిచి వొకరు వుండేవారుకారు. ఆపిల్లలిద్దరైనా వొకరితో వొకరు ఆడుకోటం అనేదిలేదు. ఇతరమానవులెవ్వరూ దృష్టిలోలేనప్పుడు మాత్రం అయిద్దరూ కాళ్లు చేతుల్తో పరిగెత్తటం, దుముకటం చేస్తుండేవాళ్లు. అది కేవలం జంగుల ఆటగావుండేది.

* * *

క్రమక్రమంగా సింగుగారి భార్యకు చాలా మచ్చికైనారు. జబ్బుపడితే అవిడతప్ప మరోవారు వాండ్ల దగ్గరకువచ్చి ఉపచారం చేయనిచ్చేవాళ్లు కారు. ఆకలివేస్తే అన్నంకోసం ఆమెదగ్గిరకి పరుగెత్తుకొచ్చేవాళ్లు. ఎంతయినా ఒకపిల్ల 8 సంవత్సరాలు, మరొకపిల్ల యేణ్ణర్థం మానవప్రపంచంలో లేకుండా తోడేళ్లతోనే పెరగడంచేత వారికి తిరిగి మానవస్వభావము, మానవుల అలవాట్లు కల్పించటంఅంటే సులభసాధ్యంకాదు. అందుచేత సింగుభార్యవారికి పూర్తిగ వాటితో చెలిమి కలగటానికి ఒకసంవత్సరం పట్టింది.

ఆరంభంలో ఆపిల్ల లిద్దరకూ, జ్ఞానము, తెలివి అనేవి శూన్యమైనట్టు కనిపించింది.కాని క్రమంగా కొంచెం కొంచెం జ్ఞానంకలుగుచసాగింది. వారిభాష మొరగటం, మూల్గటం, అరవటం మాత్రమే. రాత్రిళ్లు మాత్రం ఆదొకవిధమైన వింతఅరపు అరిచేవారు. ముందు మొరుగుడుతో ప్రారంభం అయ్యేది: పోనుపోను ధ్వని పెద్దదై, కీచుకీచు శబ్దంతో, దిశలు చీల్చుకుపోయినట్టుండేది. అది మనుషులకేగాదు; మృగాలఅరపూకాదు, బహుశా తమ పూర్వస్నేహితులైన తోడేళ్లకోసరం కావచ్చు ఆ అరుపు, ప్రతిరాత్రిన్నీ, పదిగంటలకు కొకతూరి, ఒంటిగంట కొకతూరి, మళ్లీ మూడుగంటలకొకతూరి ఈవిధంగా అరిచేవాళ్లు ఈ అరుపు చాలాదూరం వినిపించేది. కొంతకాలానికి ప్రతిరాత్రి అరవటం మానేసి, ఎప్పుడైనా ఒకప్పుడు అరుస్తుండేవాళ్లు, ఎప్పుడైనా రాత్రులే గాని, పగటిపూట అరిచేవాళ్లు కాదు:

(అంధ్రి)

The only Leading National *Bi-weekly* of the Andhra Provinces.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA
The *only* out-standing effective medium for the ventilation of views and grievances of 70,00,000 Andhras of the Premier State

*Volume* 12 — HYDERABAD - DECCAN — **Thursday 30 th December 1937** — *Number* 66

## ఎన్నుకోబడినవారలు

మదరాసు డిస ౨౭

తిరుచునా గోడనుండి ప్రధానామాత్యులగు సి, రాజగోపాలాచారిగారు, విద్యాశాఖామంత్రులగు డా, సుబ్బరాయన్ గారలు పోటీలేక [illegible]నుండి అర్థికశాఖామంత్రులగు ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశంపంతులుగారు చెంగల్పట్టునుండి తమిళనాడు కాంగ్రెసు అధ్యక్షులగు ముదలియారుగారు. [illegible]నుండి గౌ॥ రామన్ మినన్ గారెన్నుకోబడిరి.

## సి. పి, కమీష్నరు రిపోర్టు

మదరాసు డిస ౨౭

మదరాసు రాష్ట్రమందలి సేలంజిల్లాలో ప్రభుత్వమువారిచే జరుపబడుచున్న మద్యపాన నిషేధ ప్రచారము అధ్యయన మొనర్చుటకు మధ్యరాష్ట్రపు అబ్కారి శాఖాధ్యక్షులగు శ్రీ పి. యస్. రావు ఐ.సి. యస్ గారు సేలంనుండి నిన్న యిచ్చటికి విచ్చేసిరి నేడు నాగపురము వెళ్లిరి, విషయమంతయు వీరు రిపోర్టు ద్వారా మధ్యరాష్ట్ర ప్రభుత్వమువారికి నివేదించనున్నారు.

## అఖిలభారత విద్యామహాసభ

కలకత్తా డిస ౨౭

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షులగు డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు అఖిల భారత విద్యామహాసభ కధ్యక్షతవహించుటకు నిన్న విశాఖపట్టణమునుండి యిచ్చటికి విచ్చేసిరి. హౌరాస్టేషన్ యందు శ్రీ రెడ్డిగారికి ఆహ్వాన సంఘమువారును, పురపాలక సంఘాధ్యక్షులగు శ్రీ యస్. కె. రాయ చౌదరీగారును మరియు పురప్రముఖులనేకులు స్వాగతమిచ్చిరి.

## ది ఓరియంటల్ గవర్నమెంటు సెక్యూరిటీ లైఫ్ ఎష్యూరెన్సుకంపెనీ లిమిటెడ్, బొంబాయి

ప్రస్తుతము హిందూదేశమునందు జీవితభీమా వ్యాపారము దినదినాభివృద్ధి గాంచుచున్నది. ఎన్నియో క్రొత్తకంపెనీలు భీమావ్యాపారము చేయుచు క్రొత్తవ్యాపారము పొందుచునే యున్నవి. కాని "ఓరియంటల్" యొక్క వ్యాపారము యితరకంపెనీల వలెగాక అమితమైన అభివృద్ధి గాంచుచున్నది ఒకకంపెనీ యొక్క వ్యాపారభివృద్ధి చెందుచున్నదన ప్రజలకు దానియందున్న నమ్మకమే ముఖ్యకారణము.

31 డిశంబరు 1933 తో అంతమగు త్రైవార్షిక నివేదికనుబట్టి యీకంపెనీ రూ. 18 కోట్ల 32 లక్షలరూపాయల విలువగల పాలసీలను యిచ్చినదని తెలియుచున్నది. 31 డిశంబరు 1936 అఖరువరకు వ్యాపారము రూ 26 కోట్ల 73 లక్షలకుమించిన విలువగల పాలసీలు యిచ్చిరి. ప్రత్యేకముగా 1936 సంవత్సరములోనే రూ 10 కోట్ల 26 లక్షల రూపాయిల విలువగల వ్యాపారము జరిగినదన యీకంపెనీయందు ప్రజలకున్న దృఢవిశ్వాసము సుస్పష్టము. ప్రీమియములద్వారా గత 3 సంవత్సరములలో 3 కోట్ల రూపాయిలకు పైగానున్న వడ్డీ రూపముగా నికరముగా 80 లక్షల రూపాయలు ఆదాయము లెక్కలవల్ల తేలుచున్నది 1936 సంవత్సరాంతమువరకు అమలులోనున్న 3,27,000 పాలసీలు రూ 65 కోట్ల 50 లక్షల రూపాయల విలువగలవి.

సర్వవిధముల యీకంపెనీ చాల అభివృద్ధిమార్గమున యున్నది. ఇదే విధముగా యింకముందు దినదినాభివృద్ధి నొందుచు ప్రజాసేవచేయగలదని నమ్మకముగలదు.

# ముందు నుయ్యి, వెనుక గొయ్యి

## భారత రాజ్యాంగ శాసనము—

## ఫెడరేషనులో సంస్థానాధిపతుల అవస్థ

"కాంగ్రెసు కోపమునకు గురికాగలరు జాగ్రత్త!"

—సత్యమూర్తి.

"సంస్థానాధిపతులలో కొంచెము ఎక్కువ దూరదృష్టిగలవారలు భారత జాతీయ మహాసభ (ఇండియన్ నేషనల్ కాంగ్రెసు) త్వరలో ఈదేశమును పరిపాలించుచుండగలదని గ్రహించవలెను. కాంగ్రెసు ఖండించిన అభిప్రాయమునకు వ్యతిరేకముగా పోయినవారలు కాంగ్రెసుయొక్క ఆగ్రహమునకు,ఆగ్రహము కానున్న అసంతోషమునకు గురియగుట మంచిదా? వారలు కొంచెము ఆగి, అనేకపర్యాయములు ఆలోచించవలెను." అని సత్యమూర్తిగారు "త్రివేణి" పత్రికలో "సంస్థానాధిపతులు—ఫెడరేషను" అను విషయమునుగూర్చిన వ్యాసములో వ్రాసినారు.

సంస్థానాధిపతులు ఈ ఫెడరేషనును అర్థశాస్త్రవేత్తల సాహాయ్యముతో పరిశీలించవలెనని సత్యమూర్తిగారు సూచించి, ఇట్లువ్రాసినారు: "ఈ ఫెడరేషను రక్తహీనమైనది. చరిత్రలో నెన్నడును వినబడనిది, ఆచరణలో అమలుపరచవీలుకానిది. గవర్నరు జనరలుయొక్క అధికారములును, గవర్నరు జనరలుపై ప్రత్యేకించబడిన పరిపాలన విషయములును ఎంత ఎక్కువగ నున్నవనగా, బాధ్యతను అప్పగించబడినది అనుమాట అరమరలేనిదని చెప్పుటకు నాకు సాహసము నొసగునంత ఎక్కువగా నున్నవి.

"శాసనసభలోని క్రిందిశాఖయందలి సభ్యులు పాకెట్ బరోలచే, [illegible] ఆసనలనియుండును, ఎన్నుకొనబడుదురు" అనగా, రాష్ట్రీయ శాసనసభలలో క్రిందిశాఖల సభ్యులచే, ప్రాపోర్షనల్, ప్రాతినిధ్య పద్ధతిపైనను, "సింగిల్ ట్రాన్స్ఫరబిల్" పద్ధతిపైనను ఎన్నుకొనబడుదురు పైశాఖ అవాంతరపు ఎన్నికలేకుండ నేరుగ ఎన్నుకొనబడినను, దాని నెన్నుకొనుటలో వోటు హక్కు గల వారలసంఖ్య చాలతక్కువ అట్లెన్నుకొనబడిన సభకు క్రిందిశాఖకట్టి అధికారాధికారము లున్నవో అట్టి అధికారాధికారములుగలవు. దేవలోకమునుండి ఊడిపడిన సివిల్ సర్వీసు ఉద్యోగులను బలపరచుచు, హేమీలర్ నివేదిక అమలుచేయబడుచున్నది."

"సంస్థానాధిపతులు పంపు ప్రతినిధులను చాల కష్టమైన, సున్నితమైన స్థితిలో గొయ్యిన లెనుందురు, వారలు కాంగ్రెసుపక్షమున ఓట్లిచ్చినచో, వారలు విదేశాంగ రాజకీయశాఖయొక్క ఆగ్రహమునకు గురియగుదురు, వారిలో కొందరికి ఆ ఆగ్రహఫలిత మెంతవరకున్నదో తెలుసును. అట్లుగాక, వారలు అన్ని విషయములయందును ప్రభుత్వపక్షమున ఓటిచ్చి భారతీయ క్షేమావసరములకు విరోధులైనచో, వారలు బ్రిటిషిండియా ప్రజలయొక్క ఆగ్రహమునకేగాక తమ సొంత ప్రజల అతృప్తికిని కారకులగుదురు.

"ఇదంతయుగాక, ఫెడరేషనునుండి చీలిపోవుటవలన సంస్థానాధిపతులకు కలుగు స్థిరలాభములేమి? సైనూను తిరిగి తెసుకొనుము పొందవచ్చును. అది మంచివిధమే నా? దాని వల్ల అప్పు పెరగదా? ఏవిధ సంస్థానములు చెల్లించుకప్పములను సంపూర్ణముగ త్రోసివేయుట సాధ్యమగునా యనునది సంశయగతమై యున్నది. ఒకవేళ త్రోసివేయ వీలైనను, దానికై తమ హక్కులను వదలుకొనదగునా? సముద్ర రాజ్యములకు బ్రిటిషిండియానుండి రావలసిన భాగమంతయు పూర్తిగా వచ్చిననేగాని, అవి ఫెడరేషనులో చేరుటవలన లాభముకంటె ఎక్కువనష్టము పొందును.

"ఈపరిస్థితులలో సంస్థానాధిపతులు ఫెడరేషనులో చేరుటచే స్వాతంత్ర్యసామ్రాజ్యములోగాక దాస్యగృహములో పడినవారలగుచున్నారు"

తుదకు సత్యమూర్తిగారిట్లు ముగించుచున్నారు. "సంస్థానాధిపతులకు మాతృదేశసేవ చేయుటకు మంచిఅవకాశముగలదు, వారలిప్పుడు తాము ఫెడరేషనులో చేరమని చెప్పినచో, బ్రిటిషు ప్రభుత్వమువారు కాంగ్రెసుతో రాజీకివచ్చుటకంటె వేరుమార్గముండదు. బ్రిటిషుప్రభుత్వమువారట్లు చేయనిచో గాంధిమహాత్ముడున్నాడు మనకు! మేము అందరిఅవసరములను, తుదకు సంస్థానాధిపతుల అవసరములనుకూడ సంతృప్తిపరచగలిగిన ప్రణాళికను నిర్మించగలము. కనుక సంస్థానాధిపతులు ధైర్యముచేసి, భారతదేశమును ఫెడరేషను మహాభూతమునుండి రక్షించి, మాతృభూమిని కాపాడగలరని నేను సంపూర్ణముగా నమ్ముచున్నాను.

* * * *

"ఎవరికిని ఉత్సాహములేని ఫెడరేషను ప్రణాళికను భారతదేశముపై పన్త్రోయుటఅవివేకము." అని త్రివేణిసంపాదకుడు ఒకచిన్న వ్యాఖ్యనులో వ్రాసి, మొదట బ్రిటిషిండియాలోని రాష్ట్రములమధ్య ఫెడరేషను ఏర్పడవలెనని సూచించుచున్నాడు

"తుదకు దీనివలన సంస్థానాధిపతులయొక్కయు, వారల ప్రజలయొక్కయు ప్రతినిధులొకవంకను, బ్రిటిషు మంత్రులొకవంకను; కలిసినిర్ణయించు నియమముల ప్రకారము ఫెడరేషను ఏర్పడగలదు. అట్టి సమాధానము కుదురునంతవరకు బ్రిటిషిండియా రాష్ట్రములుమాత్రమే ఫెడరేషనులో చేరగలవు. ఇందుకుగాను రాష్ట్రీయ శాసనసభలతో నాలోచించిరాజ్యాంగశాసనమందు తగిన సవరణలు చేయవలెను అట్లుచేసినచో, ఇప్పటి ఆందోళనతగ్గును. సంస్థానములతో సరియైన ఫెడరేషనుకు సంబంధించిన వివరములను చర్చించుటకు తగిన వాతావరణమేర్పడును.

* * * *

"బ్రిటిషు ప్రభుత్వమువారు ఈవిషయమునంతయుగూర్చి ఆలోచించగలరని కోరుచున్నాను." అని సత్యమూర్తిగారు "ఇండియన్ రివ్యూ" పత్రికలో వ్రాయుచున్నారు.

"ఫెడరేషనులో ప్రధానభాగములు బ్రిటిషిండియా రాష్ట్రములు, ఈరాష్ట్రములు ఇష్టముతో చేరకున్నచో, ఫెడరేషను పైపునబలమంతయు [illegible] అప్పుడీ ఫెడరేషను రాష్ట్రప్రజలపక్షమున మాట్లాడయత్నించు నిరంకుశులగు గవర్నరులయొక్కయు సంస్థాన ప్రజల పక్షమున మాట్లాడయత్నించు నిరంకుశ సంస్థానాధిపతులయొక్కయు ఫెడరేషను అగును

"ఈవిషయమున రాష్ట్రప్రజల అభిప్రాయబలము సంపూర్ణముగా ఇండియా ప్రభుత్వమువారికిని బ్రిటిషుప్రభుత్వమువారికిని తెలుపబడలేదని నాఅనుమానము. రాష్ట్రప్రభుత్వములు తమకీ ఫెడరేషను ఇష్టముకాదనియు, దానిని బలవంతముగ అంటగట్టినచో, తమకందు,భాగముగాని సంబంధముగాని లేదనియు అధికారుల దృష్టికి తెచ్చుటకు సాధ్యమయిన అన్నిప్రయత్నములను చేయవలెను.

## హరిపూర్ కాంగ్రెసుకు కాంగ్రెసు యెన్నికలు

మద్రాసు డిస ౨౭

నిన్నటిరోజు నగరమున హరిపూర్ కాంగ్రెసు ప్రతినిధుల యెన్నికలు జరిగినవి. మొత్తం ౧౮ వార్డులుగా నగరము విభజింపబడియుండెను. తీవ్రమగు పోటీలు జరిగినవి. [illegible] ప్రతినిధి స్థానములకు [illegible] అభ్యర్థులు పోటీచేసిరి కాంగ్రెసు భవనమునందు వోట్లలెక్క రాత్రినుండి జరుగుచున్నది. ౧౧ వేల వోటర్లలో ౩౧౦౦ మంది వోట్లొసగిరి. ప్రజలయుత్సాహము, పరిస్థితులుచూడ యింతవరకు సత్యమూర్తిగారికే యెక్కువ వోట్లు వచ్చినట్లుగా నెనబడుచున్నది. శ్రీమతి [illegible] రుక్మిణి లక్ష్మీపతి గారు పోలింగు ఆఫీసరుగా నుండిరి సత్యమూర్తిగారి తర్వాత సోషలిస్టులగు శ్రీరామమూర్తి రుక్మిణి లక్ష్మీపతి గారలకు వోట్లు వచ్చినట్టు గలదు.

# అఖిలభారత ౨౧ వ ఆర్థిక మహాసభ

## సర్ అక్బరు హైదర్నవాజుజంగు బహద్దురుగారు ప్రారంభోత్సవకులు

## ప్రభువుగారి దివ్యసందేశము

హైద్రాబాదు డిస ౨౮

నేడు నగరమునందు శాసన సభాసభ్యులు, మదరాసు విశ్వవిద్యాపీఠ అర్థిక శాస్త్రాధ్యాపకులగు పి. జె.థామస్ ఎం. ఏ, బి. ఎలిట్., డి. ఫిల్ (ఆక్సన్) గారి అధ్యక్షతక్రింద సమావేశమైన అఖిలభారత ౨౧ వ అర్థిక మహాసభ ప్రారంభోత్సవము ప్రభుత్వ సభాధ్యక్షులగు రైటు ఆనరబల్ సర్ అక్బరు హైదరునవాజు జంగు బహద్దురు పి. సి., డి. సి. యల్., ఎల్. ఎల్. డి గారు సలిపిరి, భవనమంతయు అధికారులతో, ప్రేక్షకులతో, ప్రతినిధులతో కళాశాలల విద్యార్థులతో, క్రిక్కిరిసియుండెను. ఆహ్వాన సంఘాధ్యక్షులగు నవాబు మెహదియార్జంగు బహద్దురుగారు, రాజకీయ విద్యా శాఖామాత్యులు, సభ్యులకు స్వాగత మొనరించుచు అర్థికమహాసభ ప్రాముఖ్యత వివరించుచు, యిదివరకు నగరమునందు సమావేశమైన అఖిలభారత సైన్సు మహాసభ విజయము జ్ఞాపకమొనరించుచు గంభీరోపన్యాస మొనరించిరి. మ. ఘ. వ. నిజాం ప్రభువుగారు మహాసభ విజయమునకు బంపినసందేశమును సర్ అక్బర్ హైదరీగారు చదివి మహాసభా ప్రారంభోత్సవమును సలుపుచు ఇటుల నుడివిరి:—

ఇదివరకు సంస్థానములు బ్రిటిషు భారతదేశమునం దనవసరభాగములుగా విభావింపబడుచుండెను, కాని మనచరిత్రయందలి రాజకీయ ప్రేరణములసాంప్రదాయచిహ్నములుగా శతాబ్దములనుండి వర్థిల్లుచు [illegible] నేడు గ్రహింపబడినవి భారతౌన్నత్యమందలి వివిధసభ్యతల, సంస్కృతుల వికాసీకరణమే యీప్రేరణ. ఈ సంస్కృతుల సంరక్షణము మన జాతీయ [illegible]మందొక ముఖ్యభాగముగా గలదు. అతిప్రాచీన కాలమునుండి భారత సంస్థానములు భారతీయ సంస్కృతికి పుట్టినిల్లుగా గలవు. కాలానుసారము మార్పులు అనేకములు కలిగినను యివిమాత్రమూ భారత ప్రాచీన సంస్కృతి భావములను సంరక్షించుచున్నవి. దేశాభ్యుదయమున కీవివిధ స్థానిక భారతీయ సంస్కృతు లడ్డుపడజాలవు. ఈ దేశాభ్యుదయమునకు ముఖ్యాధారములైన ద్వివిధ—మనయందేకత్వము కలిగించుశక్తులు. స్థానిక స్వపరిపాలనమునకై అనాదినుండి జరుగుచున్న ప్రయత్నము—శక్తులందు సమత్వమేర్పరచు టత్యవసరము. ప్రతిది తనయందు తాను స్వతంత్రముగాగలదు. ఒకదానికి మరొకటి దానిపై అధిపత్యమేర్పడిన [illegible] మేర్పడును. ఈ ముఖ్యరహస్యము [illegible] విదితమగుటంజేసియే భారతాభ్యుదయమునకు కృషిసలుపుచు ఈరాష్ట్రీయుల ప్రత్యేకత్వము విశదపరచు పరిపాలనము, సంస్కృతి, అర్థిక, సాంఘికాభ్యుదయ సంరక్షణకు ప్రయత్నించు ద్వివిధాన మవలంబించియున్నది" అని విశదపరచుచు యీదక్కనుయందలి బౌద్ధుల హిందువుల, మహమ్మదీయ సమ్మేళనమువలన యేర్పడిన నూతన నాగరిక, సంస్కృతి యొక్క విశేషత్వమును వివరముగా విశదపరచిరి.

నేడు దేశమున అవరించిన యనేకసమస్యల వివరించుచు నిరుద్యోగముపై దీనికారణము లనేకవిధములుగా పృథక్కరింపబడినవి అనేకు లనేకరీతులుగా దీనిని పరిష్కరించుటకు ప్రయత్నించియున్నారు. ఇది తగురీతిగా పరిదిద్దుకొనిన పరిష్కరింపబడగలదు. నేడు ఫలప్రదాయ కృషి సలుపదలచినవారికి తగినంత యవకాశములేదు. మన దేశమునందన్ని విధములగు ప్రకృతిసౌకర్యములు గలవు. వీనిని విరివిగా నుపయోగించుకొనిన దేశీయులు నిరుద్యోగులుగా నుండగలరని నేను విశ్వసించను.

దీనిపై మనము మన ప్రకృతిసాధనముల శాస్త్రోపయోగమున కనుగుణ్యముగా మితవ్యయమునందు మార్పుగావించి మన భావిసంతానమున కనుకూలించుటయేగాక నుపయోగకరముగా నుండుటకై మన విద్యావిధానమునందు సాంప్రదాయమార్గములలో మార్పులు గావించవలయునని నిరుద్యోగ సమస్యా పరిష్కారమును సూచించిరి. వర్తమాన పరిస్థితుల కనుకూలించునటుల విద్యావిధానమును మార్చవలయుననియు, దీనివలన విద్యావంతులకు యేర్పడుచున్న ఇక్కట్టులు వెంటనే తొలగవలయుననియు, ప్రజావసరముల గ్రహించి తదానుగుణ్యముగా రాష్ట్రమందలి విద్యావిధానము మార్చబడుచున్నదనియు, దీనివలన నిరుద్యోగ మంతమొందుటయేగాక రాష్ట్రమందలి అర్థికసాధనముల అభివృద్ధి యేర్పడుననియు, ఈ అభివృద్ధి మూలమువలన మితవ్యయము చక్కబడగలదనియు, ప్రకృతి సాధనముల, విద్యాసంస్కారముల మధ్య యేర్పడుచున్న స్థిరసంబంధమువలన పాలక, పాలితుల కష్టములకు లాభదాయక మగుననియు తెలిపిరి. బ్యాంకింగ్ వివరములు విశదీకరించుచు అర్థికమాంద్యమును తొలగించుటకు రాజ్యములయొక్కయు వ్యాపారానుకూలతలు కలిగించవలయునను విషయముల నుద్బోధించిరి.

దామాషా ప్రతివత్సరమగు వ్యయమునుబట్టి యుచ్చత అర్థికశాఖ ప్రతిశాఖకును వైవార్షిక విభాగపద్ధతి యేర్పరచినవనియు, దీనివలన యెన్నియో లాభదాయకములగు కార్యములు నెరవేరుట కనుకూలించుచున్నదనియు, కార్యనిర్వహణమునకు యీశాఖావిభజన అర్థికపద్ధతుల మూలమైనవనియు, దీనివలన వివిధత్వమునుండె టుల యేకత్వ మేర్పడుచున్నదో విశదీకరించిరి.

రాష్ట్రమునందు క్రీ. శ. [illegible] నుండి స్టాటిస్టిక్సుశాఖ యేర్పడినదనియు, రాష్ట్రపు అర్థిక సమస్య లభ్యసించుటకు అర్థికసంఘము ప్రయత్నించుచున్నదనియు, రాష్ట్రమందలి వ్యవసాయకుల, కృషీవలుల అర్థికభారముల తొలగించుటకు సదుపాయములు,కనుగొనబడుచున్నవనియు వ్యవసాయమార్గములు, భూ పరిస్థితులు మార్పుగావించుటకు కృషి సలుపబడుచున్నదనియు, విద్యుచ్ఛక్తిసాధనములు అభివృద్ధిపరచి చౌకగా వలయువారికి సప్లయి చేయుట కాలోచనలు జరుగుచున్నవనియు, రైల్వేసౌకర్యము లేర్పడనున్నవనియు బలికిరి.

## సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహక వర్గము

### బొంబాయిలో సమావేశ మగును

బొంబాయి డిసం: [illegible]

రేపు ఢిల్లీలో సమావేశము కానున్న సోషలిస్టుపార్టీ కార్య నిర్వాహకవర్గము కారణాంతరాలవల్ల బొంబాయిలో ౪ వ జనవరి నాడు సమావేశము కానున్నటుల తెలియుచున్నది.

పార్టీ కార్యదర్శులగు యమ్. ఆర్. మసానీగారు కార్యనిర్వాహక సభ్యులు [illegible] వ డిసంబరువరకు సమావేశము కాజాలరనియు, అందువలన కార్యనిర్వాహకసభ అపుదలకై జయ ప్రకాశ నారాయణగారికి తంతినిచ్చిరని తెలియుచున్నది.



Printed … d by G. Ramakrishna … Power Press Hyderabad, Editor K Balakrishna Reddy